సంపుటి 10 సంచిక 18 · ఆర్ఎన్ఐ 1030 · 1-2-1991 · శుక్రవారం · రు. 1.50 లు

# జమీన్‌రైతు



సంపుటి: 62 సంచిక: 5 · స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు · మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి · సంపాదకుడు : నెల్లూరు డోలేంద్రప్రసాద్

### ముఖ్యమంత్రి ఢిల్లీ పర్యటన అంతర్యం

## పార్లమెంట్ ఎన్నికలకు సన్నాహాలు!

అధిష్ఠానవర్గ సూచి ఫలితాలు వర్తమానం అంది ముఖ్యమంత్రి, పిసిసి అధ్యక్షులిద్దరూ హుటాహుటిన ఢిల్లీ ప్రస్థానం కట్టినప్పటినుంచి రాజధానిలో వదంతుల విహారానికి అడ్డే లేకుండా పోయింది. ఈ పర్యటనపై తోచినరీతిలో వారు, ఎవరికి నచ్చినరీతిలో వారు ఊహాగానాలు చేస్తున్నారు. అయితే పోయిన స్పీడులోనే తిరిగివచ్చిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి మాత్రం తన పర్యటనలోని ఆంతర్యం ఎవరికీ తెలియకుండా కాపాడుతున్నారు. ఎంత గుచ్చిగుచ్చి అడిగినా, ఆయననుంచి ఊహామాత్రపువార్త సంపాదించడం విలేఖరుల తరంకాలేదు

తెలిసిందే. అసెంబ్లీ సమావేశాలలోగా అన్ని జిల్లాలూ పర్యటించాలని తలపెడుతున్నారు ముఖ్యమంత్రి. ఆ పర్యటనలో శాసనసభ్యుల సమర్థత, ప్రవర్తనలపై ఒక అవగాహనకు వచ్చిన తరువాతే మంత్రివర్గ విస్తరణ తలపెడతారని ఒక అభిప్రాయం.

రిపబ్లిక్ డే నాడు గాంధీభవన్‌లో జరిగిన సంఘటనపైకూడా ఢిల్లీ నాయకులు ముఖ్యమంత్రిని అడిగి వివరాలు తెలుసుకున్నారట. అయితే శ్రీ జనార్దనరెడ్డి పి సి సి అధ్యక్షుడిపై ఢిల్లీలో ఎటువంటి ఫిర్యాదు చేయబోగా, హనుమంతరావు తప్పేమీలేదని, తానే అనవసరంగా వెళ్ళి తప్పుచేశానని హుందాగా చెప్పారట. హైదరాబాద్‌లో ఏదో రాజకీయ పరిస్థితి ఏర్పడిందన్న అభిప్రాయంతో వుండిన ఢిల్లీ పెద్దలు జనార్దనరెడ్డిగారి హృదయ వైశాల్యానికి ముగ్ధులై, ఏమీ మాట్లాడలేక, కలిసి పనిచేసుకోండి అని చెప్పి సరిపెట్టేశారట

అయితే ఈ ఢిల్లీ పిలుపు వెనుగల అసలుకారణం - పార్లమెంట్ ఎన్నికలకు సన్నాహాలుచేయమని పురమాయించడమేనని చెప్తున్నారు రిపబ్లిక్ డే సంఘటన, మంత్రివర్గ విస్తరణ సమయంలో ముఖ్యమంత్రి ఢిల్లీకి పోవడంవల్ల అందరి ఆలోచనలు అటుమళ్ళాయికాని - అసలు అంతర్యంమాత్రం ఎన్నికల ఏర్పాట్లే అంటున్నారు. వచ్చే మేనెలలో లోక్‌సభ ఎన్నికలు జరిగితే రాష్ట్రంలో ఎన్నిస్థానాలు సంపాదించే వీలుంటుందన్న అంచనాపై ఢిల్లీ నాయకులు జనార్దనరెడ్డి, హనుమంతరావు లిద్దర్నీ వివరణ కోరినట్లు తెలుస్తున్నది.

చంద్రశేఖర్ ప్రభుత్వాన్ని ఎక్కువ

—కొరవ 8 వ పేజీలో

### రాజధాని లేఖ

ఢిల్లీ పిలుపు అనగానే ప్రతిఒక్కరికీ మెదిలిన ఊహ- మంత్రివర్గ విస్తరణనే! బడ్జెట్ సమావేశాలు సమీపిస్తున్న తరుణంలో మంత్రివర్గ విస్తరణ తప్పదన్న భావం ప్రబలంగావుండటంబట్టి అందరి ఆలోచనలూ అవైపే వెళ్ళాయి. కాని ఢిల్లీలో ఈ విషయమై సంప్రదింపులు జరిగిన దాఖలాలేవీ కన్పించడంలేదు ఈ పుణ్యకార్యం ఈ వారంలో జరిగిపోతుందన్న ఆశ మంత్రిపదవులాశిస్తువారిలో ప్రబలంగా వున్నప్పటికీ, జనార్దనరెడ్డి అటు ఢిల్లీలోనేకాక, ఇటు రాజశేఖరరెడ్డి వెంగళరావు వంటి అంతరంగిక నాయకులతోనూ ఇంకా చర్చలు జరపలేదన్నది వాస్తవం. వీరితో సంప్రదించనిదే ముఖ్యమంత్రి ఏ నిర్ణయమూ తీసుకోడన్నది

## శృతిమించుతూన్న పి సి సి న్యూసెన్సు!

పిసిసి అధ్యక్షుడు శ్రీ హనుమంతరావు వ్యవహారసరళి విమర్శలకు గురవుతోంది ముఖ్యంగా రాష్ట్రప్రభుత్వం పట్ల రాష్ట్ర ముఖ్యమంత్రిపట్ల ఆయన దూకుడుగా పోతున్నారని కాంగ్రెస్ వర్గాలు విమర్శిస్తున్నాయి. ప్రభుత్వ కార్యక్రమాలను సమన్వయంచేసుకుని పార్టీని పటిష్ట చేయడానికి బదులు పిసిసి ద్వారా పెత్తనం చేయాలన్న కోరిక కనిపిస్తోందని పలువురు కాంగ్రెస్ నిపుణులు అంటున్నారు. ప్రభుత్వంమీద, మంత్రులమీద నిఘా వేశానని అధ్యక్ష ప్రకటించి వివాదానికి శ్రీకారం చుట్టారు ప్రభుత్వ కార్యక్రమాల అమలులో మంచిచెడులను పరిశీలించి ప్రభుత్వదృష్టికి తీసుకురావడంలో తప్పులేదుకానీ, తానే 'సుప్రీం' అన్న ధోరణిలో 'నిఘా' వేశాననడం పార్టీకి మంచిదికాదని సీనియర్ నాయకులు సైతం అంగీకరిస్తున్నారు అలాగే నారాయణఖేడ్ హాస్టల్ ఉదంతంలోనిజం లేదని ఒక ప్రక్క ముఖ్యమంత్రి ప్రకటించినా అందులో నిజానిజాలు తెలుసుకొనేందుకు పిసిసి నిజనిర్ధారణసంఘం నియమించడంకూడా వివాదానికి కారణమైంది.

> **హనుమంతరావు ఆశలు పెరిగినా జనార్దనరెడ్డికి నిగ్రహం తరగలేదు!**

నిన్నగాక మొన్న గాంధీభవన్‌లో గణతంత్ర దినోత్సవం రోజునకూడా 'దూకుడు'గాపోయి అందరి విమర్శలకు గురయ్యారు. గాంధీభవన్‌లో పతాకావిష్కరణ ఉదంతం ఎనిమిది గంటలకు జరుగుతుందని, ఆ కార్యక్రమానికి హాజరు కావల్సిందని ముఖ్యమంత్రిని ఆహ్వానించారు పి సి సి అధ్యక్షుడి ఆహ్వానం మేరకు పతాకావిష్కరణకు హాజరయ్యేందుకు ముఖ్యమంత్రి అంగీకరించారు. 26వ తేదీ ఉదయం ఏడు గంటల యాభై నిమిషాలకు స్వగృహంలోని కార్యాలయం వద్ద జెండా ఎగరేసి గాంధీభవన్‌కు బయలుదేరారు ముఖ్యమంత్రి. ఈ విషయాన్ని

—కొరవ 8వ పేజీలో

# ఉత్తరక్రియలు



మా తండ్రి

## శ్రీ మాదాసు సేతురామయ్యగారు

(కుల్లూరు, కలువాయి మండలం, నెల్లూరు జిల్లా.)

28-1-91 తేది సోమవారం హైదరాబాదులో పరమపదించారు.

### వారి ఉత్తరక్రియలు

7-2-91 తేది గురువారం కుల్లూరు గ్రామంలో

మా స్వగృహమున జరుగును.

గాన బంధుమిత్రులకు తెలుపడమైనది.

ఇట్లు

మాదాసు గంగాధరం

Ex. M. L. C.

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, Nellore